# రాఘవ శతకము



గ్రంధకర్త్రి:

కవితావిశారద ఉభయభాషా ప్రవీణ,

అట్లూరి వేంకటసీతమ్మ.

# రాఘవ శతకము


గ్రంథకర్త్రి:

కవితా విశారద, ఉభయభాషా ప్రవీణ,

అట్లూరి వెంకటసీతమ్మ.



First Edition-500 copies.






ప్రకాశకులు:

కామేశ్వర్ అండ్ బ్రదర్సు,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

బెజవాడ.

1935.




వెల రు 0—4—0.

బెజవాడ

కామేశ్వర్ అండ్ బ్రదర్సు వారి

శ్రీ బాలసరస్వతీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.



# రాఘవశతకము.

శ్రీయని యెంచునంత సజ్జనచేత గ్రహించి విశేషసంపదల్
శ్రేయము మేల్మి నిత్తువని ప్రీతిని బల్కెడు తాపసోత్తముల్
సాయము సేయుచుంటను విశాలమతిన్ స్మరియించుచుండ నా
ప్యాయము తోడ గాంచి తగు హర్ష మొసంగవె తండ్రి రాఘవా॥

1. అర్థము:—శ్రీయని=లక్ష్మి లేక (ఐశ్వర్యమని) ఎంచునంతన్=తలంచిన మాత్రమున; శ్రేయము=శుభము; మేల్మి=అధికముగా; విశాల మతిన్=జ్ఞానబుద్ధితో ; ఆప్యాయము=మిక్కిలి ప్రీతి.

చ॥ కలుములతల్లి లక్ష్మి యనుకంపము నింపుచు భక్తసంఘమున్
వెలికిని ద్రోయకెంతయు సువీక్షణముల్ ప్రసరింపుమించి వే
వెలుప ననంతరూప! నిజదీప్తివికాసము విస్తరింపఁగా
నలరెడుసూర్యవంశమున కంపము బెంపవె తండ్రి రాఘవా॥

2. అర్థము:—కలుములతల్లి=ఐశ్వర్యమిచ్చుతల్లి; అనుకంపము=ప్రేమ; సువీక్షణముల్=మేలైనచూపులు; అలరెడు=ప్రకాశించుచున్న; దీప్తి=కాంతి.

చ॥ జనకుని కొల్వుకూటమున ♦ సాహసశక్తి విలాసధీరుఁడై
యెనుమునఁగూర్చినట్టి విలు♦నేర్పఱవంచివిదేహనాథుఁడున్
జనవరవర్గముల్,పొగడ♦స్థైర్యము,వీర్యము,రాజసంబునున్
బెనగొను నిన్నుఁ జేరి ముఱి♦సింపదె సభ్యుల సీతరాఘవా॥

3. అర్థము:— కొల్వు కూటమున = సభాస్థలమందు; విలున్=శివునివిల్లు; పట్టెజన్=శౌర్యముతో; వంచి=ఎక్కుపెట్టి జనవర వర్గముల్=రాజులగుంపు; పెనగొను=చుట్టుకొను.

ఉ॥ రామలలామసీత రఘు♦రామ మహోన్నత భాసమానయై
మోమువికాసమొందఁగను♦మోదమునన్ దరిఁ జేరఁగా రమ
న్నెమముతోడ వక్షమున♦నిల్పిన కేశవుపోల్కి మానసా
రామములోఁ దలంతు ముని♦రాజులు పూజలొనర్ప రాఘవా॥

4. అర్థము:—రామలలామ=స్త్రీలలో శ్రేష్ఠురాలు; మహోన్నత భాసమానయై=మిక్కిలి ప్రకాశించుచున్నదై; రమన్=లక్ష్మీదేవిని; వక్షము=ఎదుఱొమ్ము; కేశవు=విష్ణుని దలంచి; మానసారామము=మనస్సను పూదోట.

ఉ॥ నూతన, రాగ, రంజిత, మ◆నూన, విభాసుర, రూపరాశియా,
సీతను, విల్లువంచి◆వికసించిన కోర్కులు క్రేళ్లు వారఁగా
నాతతశౌర్య శుక్తియని యచ్చటఁ జాటి కరంబుపట్టి సా
కేతముఁ జొచ్చి వందిజన ◆గీతము లందవె నీవు రాఘవా॥

5. అర్థము:—నూతన రాగరంజితము=క్రొత్తదైన యను రాగముచే నింపు గల్గించునది; అనూన విభాసుర, రూపరాశియా=మిక్కిలి ప్రకాశించుచున్నట్టి యందము గలిగినట్టి; క్రేళ్లు వారఁగా=గంతులు వేయుచుండఁగా; శుక్తి=ముత్యము; సాకేతము=అయోధ్యానగరము.

చ॥ రవికుల సంభవంబె, రఘు◆రామ! విశేషము శోభనిచ్చె నీ
భువి జనకావనీపతికి ◆మోద మొసంగుచు నల్లు డౌట భూ
ధవ! యతి ధన్యమయ్యె నిఁక◆దద్దయు నాజనకాత్మజాత శో
భనము సుఖంబు నెంచెద పృథుభక్తుల బ్రోతువు ప్రీతిఁ రాఘవా॥

6. అర్థము:—రవికులసంభవంబె=సూర్యకులములోఁ బుట్టుటయే; శోభను=కాంతిని; భూధవ=ఓరాజా (రామా;) జనకాత్మజాత=జనకునికూఁతురు(సీత;) భనము=జీవితము(పుస్తిక.)

మొగము వికాసవంతమయి◆మోహముఁ గొల్పఁగ నమ్మ భామలన్
నగవులు బెంచి, నెమ్మనము◆నాట్యప్రహాసము సారె సారెకున్

దగవులు వెట్టు జానకి వి♦ధంబు ముదంబును గూర్చుచుండె నా
మగవకు సౌఖ్యమిచ్చు గురు♦మాన్యతఁ జూపవె తండ్రి రాఘవా॥

7. అర్థము:—నర్మభాషలన్=సరసపుపల్కులచేత; నగవులు=నవ్వు; ప్రహర్షము = మిక్కిలిసంతోషము; గురుమాన్యత=అధికమైనగౌరవము.

ఉ॥ ప్రాకటసత్యవాక్య పరి♦పాల విశేష నిరూపణార్థమో
నాకనివాసులందు మది ♦నర్మిలిగల్గి దశాస్యు ద్రుంపనో
లోకమునందు మానవుల♦లోపము దిద్దఁ దలంచి యుండుటో
కాక ధరాతలంబునఁ బ్ర♦కాశమతిన్ జనియింప రాఘవా॥

8. అర్థము:—నాకనివాసులు=దేవతలు; నర్మిలి=ఇష్టము (ప్రేమ) దశాస్యుడు = రావణుడు; లోపముల్ = తప్పును; ధరాతలంబునన్=భూమిమీద.

ఉ॥ భక్తులఁ బ్రోవ దీక్ష నిజ ♦భావ, నిబద్ధ,నిరూఢమైన నా
సూక్తిని సంస్మరించుటకు ♦ శోభిత సుందరగాత్రి సీత సం
సక్తిని బాయలేమి వ్యవ♦సాయమొనర్పవు సాధుపుంగవుల్
ముక్తిని వేడుచున్న రఘు♦ముఖ్య! యయోగ్యముగాదె రాఘవా

9. అర్థము:—నిజ,భావ,నిరుద్ధ,నిరూఢమైన,=తనమనస్సునందుఁ గట్టిగా నాటియుండినను; సూక్తి=మాట (వాక్యము)

సంస్మరించుటకు=తలంచుటకు; శోభితసుందరగాత్రి=అందమైన శరీరముగలదైనసీత; సంసక్తి=తగులము (ప్రేమ) వ్యవసాయము=ప్రయత్నము; అయోగ్యము=తగనిది.

చ॥ పురుషుని కీర్తివర్ధనము • భూషిత, ధర్మ, విశుద్ధ, పద్ధతుల్
వరగుణయుక్తి నిశ్చయము • వారిజనేత్రి సహాయమాత్రమే
తిరముగ లేనిచో, నిల ప్ర • దీప్తులొసంగునె? పాలనార్థమై
సరగునఁబంపు నంతిపురి • చయ్యనఁబాపి మహీజ రాఘవా.

10 అర్థము:—వర్ధనము=అభివృద్ధియగుట; భూషిత, ధర్మ విశుద్ధ పద్ధతుల్=పొగడబడునట్టియు, న్యాయమైనట్టియు, స్వచ్ఛమైనట్టియు మార్గములు. వరగుణయుక్తినిశ్చయమున్= మంచిగుణముయొక్క నేర్పును నిర్ణయించుటయును; వారిజ నేత్రి=స్త్రీ. (సీత) ప్రదీప్తులు=కాంతులు; మహీజ=సీత.

ఉ॥ సీత ముదంబు నొంద సవి • శేష, వినోద, విలాస, లీలచేన్
జేతముఁ బల్లవింప కమ • నీయ, విహారమొనర్చు నత్తఱిన్
భీతి మనంబు నిండ, నరి • బృందము పీడలడంప, భక్తులో
కాతరమంది వేడ, నను • కంపముఁ జూపవె తండ్రి రాఘవా.

11 అర్థము:—సవిశేష, వినోద, విలాస, లీలలన్=అధిక మైన సంతోషముతోను, ఆశ్చర్యముతోనుగూడిన వేడుకలచేత;

చేతము=మనస్సు; కమనీయ=ఇంపైన; అరిబృందము = శత్రు సమూహము; కాతరము = భయముతోఁ గూడిన చీఁకాకు; అనుకంపము=జాలి.

ఉ॥ స్రుక్కుచు ఘోరసంసరణ♦రోగముఁ బాగు నుపాయ మెవ్విధిన్
నిక్కముగాఁ గనన్ దగిన♦నిర్మలమార్గము బోధకాక లోఁ
బొక్కుచు దుఃఖవార్ధిఁ బడి♦మూర్ఖులు గుందెడివేళ సీత పె
న్మక్కువ నాలకించి నినుఁ ♦బంపదె దుఃఖము మాన్ప రా॥

12 అర్థము:— స్రుక్కుచున్ =బాధపడుచు; ఘోర సంసరణరోగము=గొప్పదైన సంసారబాధ; బాగు=తప్పించు కొనునట్టి; బోధకాక=తెలిసికొనలేక; పొక్కుచున్=విచార పడుచు; దుఃఖవార్ధిన్=దుఃఖమనెడి సముద్రములో; కుందెడి వేళ=ఏడ్చునప్పుడు; పెన్మక్కువన్=మిక్కిలి ప్రీతితో.

చ॥ జగమున సర్వజీవులకు ♦సౌఖ్యము గూర్చి నిరంతరంబు నే
వగయును లేక సర్వసమ ♦ బంధుఁడవై శరణార్థి కోటికిన్
వగపును మాన్పి రక్షణమ♦వశ్యము సేయుట ధర్మమార్గమై
తగునని సాధ్వి దిద్దు నిను ♦ దాశరథీ! రఘురామ ! రా॥

13 అర్థము:—నిరంతరము=ఎల్లప్పుడు; శరణార్థికోటికిన్= రక్షింపుమని యడిగినవారికి; వగపును=దుఃఖమును; అవ

శ్యము=తొందరగా; సాధ్వి=భార్య (సీత) దాశరథీ=దశరథుని కుమారుఁడైన రామా.

ఉ॥ మూఘులు దైవభక్తియను పుణ్యపువాక్కు తెలుఁగఁజాలకే
రూఢియుఁ దోపకుంట, నిలఁ బ్రుంగుచు నచ్యుతునాదిదేవునిన్
గూఢుని ఘోరపాపములఁ గొట్టెడు నిన్ను ఛలోక్తిఁ బిల్వఁగా
గాఢముదంబు నొంది గమకంబునఁ బంపవె సీత రాఘవా.

14 అర్థము:—ఏరూఢియున్=ఏమార్గమును (ఏవిధమును) బ్రుంగుచున్=బాధనొందుచు; అచ్యుతున్=భగవంతుని; గూఢుని=తెలియఁజాలనివాని; ఛలోక్తిన్=అకస్మాత్తుగా నుచ్చరించుమాట; గమకంబునన్=మిక్కిలియత్నముతో.

చ॥ పుడమిని రామదాసు పరిపూర్ణ, సుఖంబుల రోసి భక్తిమైఁ
దడయక పాదుషావలని తర్జన, భర్జన దండనార్భటుల్
పడయుచు నిన్నుఁ గొల్వఁడె విలాసము యుక్తమె రక్షణార్థమై
వెడలవె యంచు సాధ్వి విని పింపదె పంపదె తండ్రి రా॥

15 అర్థము:—పుడమిని=భూమిమీద; రోసి=అసహ్యించి (విడిచిపెట్టి) పాదుషా=నవాబు (గోలకొండ ప్రభువైన కుతుబుశాహి) తర్జన, భర్జన, దండనార్భటుల్=అదలింపులు, బెదరింపులతోఁ గూడిన శిక్షతోటి కేకలు.

ఉ॥ భక్తులు నీదు మంత్రజప • పారణఁ జేయఁగ నాలకింప క
వ్యక్తుఁడవైన నిన్ను గని • వత్సలతన్ జనకాత్మజాత చి
చ్ఛక్తి దయార్ద్రపూర్ణ పరి•తాపమునొందుచు భక్తరక్షణా
సక్తునిఁ జేసి పంపుట, యశ•శంబును గాంచితి వీవు రాఘవా.

16 అర్థము:— అవ్యక్తుఁడవు = తెలియనేరని వాఁడవు; వత్సలతన్ = ప్రేమతో; భక్త రక్షణాసక్తునిన్ = భక్తులను గాపాడవలెనను బుద్ధిగల వానినిగా; చిచ్ఛక్తి = ఆదిశక్తి; యశము=కీర్తి.

ఉ॥ తండ్రికి బిడ్డలందు దయ, • తల్లికిఁ గ్రొన్నయంత పెద్దగా
దండ్రు,నిజంబుగాదె విన•యంబున నిచ్చలుగొల్చు భక్తులో
తండ్రివిరామచంద్ర!యవ•ధానముతో నినుఁబిల్వఁ బల్కకే
గండతఁ జూప సీత యవ• కాశము దెల్పుచుఁ బంపు రా॥

17 అర్థము:—పెద్దగాదండ్రు=ఎక్కువగాదని చెప్పుదురు; నిచ్చలు=ఎల్లప్పుడు; అవధానముతో = మిక్కిలి శ్రద్ధతో; గండతన్=కఠినత్వమును; అవకాశము= తెఱపి (వీలు)

ఉ॥ లోకములోఁ బ్రబుద్ధులకు •లోచన, గోచర, మాటకే కదా
ప్రాకటమైన రాజ్యరమ•భంగమునొంద నొకించుకైన చీఁ

కాకును జెందకే యతివ • కానకు, నీ వెనువెంటవచ్చె మీ
పోకడ లెన్నఁగాఁ దరమె • భూమిసుతాధిప! రామ! రాఘవా.

18 అర్థము:— ప్రలుబ్ధులు = పిసినిగొట్టు మనుష్యులు ; లోచన గోచర మాటకున్=(స్పష్టముగాఁ దెలియుట కొఱకు) కన్నుల కగఁపడుటకు; రాజ్యరమ=రాజ్యలక్ష్మి; చీఁకాకు= విచారము; అతివ=స్త్రీ; (సీత) భంగమునొందన్=నష్టమయి నప్పటికిని; మీ పోకడలు=మీ నడతలు; ఎన్నఁగాన్=లెక్కిం చుటకు.

చ॥ సహనము సాధ్వీలక్షణము • సంస్తుతిపాత్రమునంచు మౌనులి
మహిఁ గడువిజ్ఞులై పలుకు • మాట నిజంబగు, కానిచో ముదా
వహమునఁ గైకయాజ్ఞ, తల • వంచుచు, మ్రొక్కుచు, శాంతచిత్తయై
తహతహ నీ వెంటఁ జను • తామరలోచన నెంచ రాఘవా.

19 అర్థము:—సహనము=ఓర్పు; సంస్తుతిపాత్రము=పొగడఁదగినది; మౌనులు=మునులు; విజ్ఞులై = తెలిసినవారై ; ముదావహమునన్=సంతోషముతో; తహతహన్=ఆత్రముతో తామరలోచన=తామరలవంటి కన్నులు గలది; (సీత)

ఉ॥ శ్రీరమకాంత, సోదరులు • శేషుఁడు, శంఖము, చక్రమున్ సదా
ధారము, చిత్తశాంతిగలి • దాన నిదానము, జన్మమూని సం

సార ముదంబునొంది వర•శక్తివిజృంభణ దూర దృష్టిమై
భారమునాక శ్రీఘగతి •భక్తకదంబముఁ బ్రోవు రాఘవా.

20 అర్థము:—శ్రీరమ=లక్ష్మీదేవి; శేషుఁడు=ఆదిశేషువు; ఆధారము=సహాయము; నిదానము=ఆదికారణము; జన్మము=పుట్టుక; భారమునాక=బరువనక; భక్తకదంబము=భక్తుల సమూహము; వరశక్తివిజృంభణన్=శ్రేష్ఠమైన బలాధిక్యముచేత.

తలనుధరించుపుష్పములు•తావులఁజిమ్ముచునింపుఁగొల్పుచోఁ
చెలఁగుచు వేణిఁదాల్తురటు•చేడియలొక్కట,వాడిపోవుచో
నిలపయిఁ బారవైతురు,మ•హీజనులీక్రియ,భాగ్యమున్నచోఁ
గులుకుచుఁ జేరవత్తురది•కుంఠితమైనఁ దొలంగు రాఘవా.

21 అర్థము:—తావులు=సువాసనలు; చెలఁగుచు=సంతోషపడుచు; వేణిన్=ముడియందు; (జడలోపల) చేడియలు=స్త్రీలు; కులుకుచు=సంతోషించుచు; కుంఠితమైన=తగ్గిపోయిన యెడల; ఇంపు=ఆనందము.

ఉ॥ వేగముగా నదీజలము •వెల్లువయై ప్రవహింప నడ్డకే
సాగొనరించు వేళల వి•చారమునొందెడు రైతుపోల్కి, ను
ద్యోగముసేయు కాలమున •యోచనసేయక ఖర్చుపెట్టి యా
వేగముఁజెందు మానవుల • పిచ్చితనంబులుమాన్పు రా॥

22 అర్థము:—వెల్లువమై=ప్రవాహమై; సాగు=వ్యవసాయము; ఆవేగము=తొట్రుపాటు; రైతు=పొలమునుదున్నివ్యవసాయముసేయువాఁడు; అడ్డకే=సీటిప్రవాహమును నిల్పుటకు గట్టువేయక.

చ॥ కలిమియె సర్వసౌఖ్యముల♦గ్రన్నననిచ్చు మహీతలంబునన్
సులువుగ దానిఁ గూర్పదగు♦సూచన నేర్చుటకంటె,గొప్పదౌ
మెలఁకువ లేదటంచు మిడి♦మేలపుటాస సమస్తధర్మముల్
తొలఁగు మనుష్యవర్గముల ♦ దుర్దశఁ బాపఁ దలంపు రా॥

23 అర్థము:—కలిమి=భాగ్యము; సూచన=విధానము; (పద్ధతి) మెలఁకువ=జాగ్రత్త; సులువు=తేలిక; కూర్పదగు=సంపాదింపఁగల్గిన; మిడిమేలపుటాస = అందరాని కోర్కె; దుర్దశ=కష్టమును.

ఉ॥ జ్ఞానము గల్గియున్న ధన♦సంపద మిక్కుటమైన స్థానమున్
మానుట సంభవింప, నను ♦ మానము లేల ప్రజాళిలోపలన్
మానమునిల్చె నేనిబహు♦మానముగాదె మృణాళనాళముల్
స్థానమువీడి వాడుట య♦థార్థముసూవె తలంప రాఘవా.

24 అర్థము:—మిక్కుటమైన= అధికమైన; స్థానమున్= ఉన్నచోటును; మృణాళనాళముల్=తామరతూండ్లు; మాన

ము=మర్యాద; ప్రజాళిలోపలన్=జనసమూహములో; యథార్థము=నిజము.

ఉ॥ కూడినభాగ్యరేఖ, సమ ♦ కూడిన సంపద, బిడపాపలున్,
బోడిమిగల్గుమందిరము, ♦బొల్పగుధర్మము,జ్ఞానవిద్యయున్,
వాడుకనొందువర్తనము,♦వశ్యములింద్రియవర్గముల్ వడిన్
వేడుకొనంగబుద్ధి యతి♦వేలముగా నొనఁగూర్చు రాఘవా.

25 అర్థము:—భాగ్యరేఖ=అదృష్టము; సంపద=ధనము; పోడిమిగల్గు=అందమైనట్టి; మందిరము=ఇల్లు; పొల్పగు=స్థిరమైన; ధర్మము=న్యాయము; వాడుకనొందువర్తనము=ప్రసిద్ధికెక్కెడి నడత; ఇంద్రియ వర్గముల్ = కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము నను పంచేంద్రియములును; వశ్యములు=స్వాధీనమైనవిగానుండునట్లు; అతివేలము=ఎక్కువ.

చ॥చతురతఁజూపికార్యములఁ♦జయ్యనఁజేయకుపేక్షసేయుచున్
సతతము సంచరింపఁగొన♦సాగునె కార్యకలాపముల్ వడిన్,
మతిఁదలపోసిచూడఁగ,న♦నంతరమెట్టిప్రయత్నముల్ గొనన్
గతజలసేతుబంధనము ♦గాదె రఘూద్వహా! వీరరాఘవా.

26 అర్థము:— చయ్యనన్=తొందరగా; ఉపేక్షసేయుచున్=అశ్రద్ధచేయుచు; అనంతరము=పిమ్మట; కొనసాగునె=

(పని) నెఱవేఱునే (నెఱవేఱదనిభావము) గతజల సేతుబంధనము=చెఱువులోని నీరంతయు బయటికిఁబోయినతరువాత నడ్డముగాఁగట్టుబోవుట; రఘూద్వహా=రఘుకుల శ్రేష్ఠా.

ఉ॥ వంకరఁదీర్చినిల్పబహు♦భంగులలాగుచు శ్వానపుచ్ఛముఁ
గొంకకపట్టినన్ ఫలము♦గొండొక కల్గునె నవ్వుబాటుగన్
పెంకితనంబు నూని నిజ♦ బింకము వీడక మూర్ఖులై కడున్
జంకక సంచరించు జన♦సంఘము దిద్దఁగనౌనె రాఘవా.

27 అర్థము:—బహుభంగులన్=అనేకవిధములుగా; శ్వానపుచ్ఛమున్=కుక్కతోకను; కొంకక=జడియక; కొండొక=కొంచెమైనను; నిజబింకము=తనపట్టుదల; జంకక=వెనుదీయక; దిదఁగనౌనె=బాగుచేయఁగలమా? చేయలేము.

ఉ॥ పూజలొనర్ప నెంతు కుల♦ముఖ్యుల పెద్దలఁగొల్చిభక్తితో
భూజనవర్గముల్ తమకుఁ♦బొల్పగువిద్యయు, భాగ్యభోగ్యముల్
భాజనమొప్పఁగోరి, నర♦పాలుర గొల్తురు భుక్తిమాత్ర, కే
యోజ ఫలింప సాధుగణ♦ మొప్పఁగ నిన్నుఁదలంతు రా॥

28 అర్థము:—కులముఖ్యులు=కులములో శ్రేష్ఠులైనవారు; భూజనవర్గముల్=జనులగుంపులు; భాజనమొప్పఁగోరి=అర్హతబొందవలెనని కోర్కతో; ఏయోజ=ఏవిధము; నరపాలురన్=

రాజులను; పొల్పగు=శాశ్వతమైనట్టి.

ఉ॥ మేలపు పల్కులాడి మిడి♦మేలపు మైత్రి నిరంతరంబు వా

చాలతఁజూపి నిర్మల వి♦చారుల, మాయకచిత్తులౌ, ప్రజన్

లాలనఁజేసి మోసమున ♦నాశమొనర్చి ధనంబు గుంజి లో

గోల పడంగఁజేయు నరు ♦గోముఖ వ్యాఘ్రమటండ్రు రా॥

29 అర్థము:—మేలపుపల్కులు=ఇంపుగలించు మాటలు; (పరిహాసములు) మిడి మేలపుమైత్రి= (నడుమంత్రపుస్నేహము) అపాయకరమైనస్నేహము; వాచాలతన్ = వదరబోతుఁదనము; అమాయకచిత్తులై=కపటమెఱుఁగనిమనస్సుగలవారిని; లాలనఁజేసి=బుజ్జగించి;గుంజి=లాగుకొని; గోలపడంగఁజేయు=బాధ పెట్టునట్టి;వ్యాఘ్రము=పెద్దపులి.

ఉ॥ లోకుల మాటనమ్మి యవ♦లోడనసేయక రంగమందు నొ

క్కూకునదూకినన్ యశము,♦నున్నతి,గౌరవ,శక్తియుక్తులున్

జేకుఱుఁబో వదెట్లనినఁ ♦ జేతులు గాలిన వెన్క నాకులన్

దాకినఁ గల్గునే ఫలము ♦ దానవభంజన వీరరాఘవా.

30 అర్థము:—లోకులమాట=జనులమాట; అవలోడనసేయక=బాగుగా విచారింపక; రంగమందున్=పనుల నెఱవేర్చు స్థానమందు (యుద్ధమందు, పార్టీకక్షలందు) ఊకునన్=

పూనికతో; యశము=కీర్తి; ఉన్నతి=గొప్పదనము; గౌరవము=మర్యాద; శక్తియుక్తులున్=బలమును, తెలివియును; చేకుఱంబోవు=కలుగనేరవు; దానవభంజన=రాక్షసులను గొట్టినవాఁడా! (రామా)

ఉ॥ దుష్టుని చుట్టమంచు గుణ♦దోషము లెంచక మేలుగూర్పఁగా
నిష్టమొ కష్టమో శ్రమల♦నీదుచునుండ గ్రహింపకిమ్మెయిన్
నష్టము పాలుసేత తయి♦నాతి నొనర్చి విషాదపెట్టుటల్
దుష్టభుజంగజాతి కిల♦దుగ్ధము పోయుట గాదె రాఘవా.

31 అర్థము:—గుణదోషములు=మంచిచెడ్డలు; ఎంచక=ఆలోచింపక; శ్రమలన్=కష్టములను; ఈదుచునుండన్=సహించుచుండఁగా; గ్రహింపక=తెలిసికొనలేక; ఇమ్మెయిన్=ఈరీతిగా; నష్టముపాలుసేత=నష్టపెట్టుటవలన; తయినాతిన్=సేవకునిగా; విషాదపెట్టుటల్=ఏడ్పించుట; దుష్టభుజంగజాతికిన్=చెడ్డవైన పాములకు; దుగ్ధముపోయుట = పాలుపోయుట.

ఉ॥ భర్తయె దైవమన్న గుణ♦పాఠము నేర్పగడంగి కాదె స
ద్వర్తనగల్గు సీత వన♦వాసముఁ బంపితి వంతనౌనె, ని
ర్వర్తిత నీతిశాలిని స♦భాజన గౌరవయుక్త శీల సం
కీర్తనఁ జేయఁగా వలదె♦ కిల్బిషనాశన! తండ్రి రాఘవా.

32 అర్థము:—గుణపాఠము=నీతివిద్య; కడంగి = ప్రయత్నించి; సద్వర్తనఁగల్గు=మంచినడతఁగల్గిన; వనవాసము౯= అడవిలో నివసించుటకు; నిర్వర్తిత నీతిశాలిని=నెఱవేర్చిన నీతి గలది; సభాజనగౌరవయుక్తశీల=పెద్దలచేత గౌరవింపఁబడునట్టి నడతగలది; సంకీర్తన౯=పొగడుట; కిల్బిషనాశన=పాపములను బోఁగొట్టువాఁడా. (రామా)

ఉ॥ లోకములో నుదారులు ప్ర♦లోభముపీడి దరిద్రబృందము౯
సాకుట కోసమై తమ య♦నంతపు సంపద వెచ్చఁబెట్టఁగా
లోకులు నోర్వలేక యవ ♦ లోడన సేయక గేలిసేయుటే
లోకులు కాకులంచు నొక ♦లోకపు వాడుక లేచె రాఘవా.

33 అర్థము:—ఉదారులు=ఇచ్చువారు; (దాతలు) ప్రలోభముపీడి=పిసినిగొట్టు తనమునువూని; సాకుటకోసమై=పోషించుటకొఱకు; అనంతపుసంపద=విస్తారమైనభాగ్యమును; వెచ్చఁబెట్టగా౯ = ఖర్చుచేయఁగా; అవలోడనసేయక = పరామర్శ చేయక; గేలిసేయుటే = పరిహాసముఁ చేయుటచేత.

ఉ॥ ఆతత శౌర్యశాలి యగు ♦నాగురుఁడేర్చిన తమ్మిమొగ్గరం
బాతఁడెఁజూచితొట్రిలియ♦మాత్మజుఁడంత వివేకశూన్యుఁడై
పోతరియౌ కిరీటిసుతు ♦ బోరునఁ గోల్పడి కుందఁడే సదా
యాతురగానికి౯ దెలివి ♦నారయుమట్టము గాదె రాఘవా.

34 అర్థము:—ఆతత శౌర్యశాలియగు=గొప్పపరాక్రమవంతుఁడగు; పర్చిన=పర్పాటుఁజేసిన; తమ్మిమొగ్గరంబు=పద్మవ్యూహము; తొట్రిలి=సంభ్రమించి; యమాత్మజుఁడు=ధర్మరాజు; వివేకశూన్యుఁడై=ఆలోచన లేనివాఁడై; పోతరియా=బలిసియున్నట్టి; కిరీటిసుతుఁ=అర్జునుని కొడుకైనయభిమన్యుని; కోల్పడి=నష్టపడి; కుందఁడే=విచారపడఁడే; ఆతురగానికిఁ=తొందరపడు వానికి; తెలివి=ఆలోచన; మట్టము=శూన్యము.

ఒకరిగృహంబుసొచ్చియుప•యోగపదార్థముగోరఁబోవుచోఁ
బికబికలై మనంబు నతి•వేల విచారపరీతమై నుడుల్
చకచకఁబల్కనీమి నిజ•చేష్టలుదక్క, ముఖంబువాడ యా
చకుఁడు శవంబు భాతినగు •సారవివేకియునైన రాఘవా.

35 అర్థము:—ఉపయోగ పదార్థము=అవసరమైనవస్తువు; (భోజనాది సమస్త వస్తువులునని భావము) పికపికలై=చెల్లాచెదురై: అతివేలవిచారపరీతమై = మిక్కిలి విచారముతో నిండినదై; నుడుల్=మాటలు; సారవివేకియునైన=మంచి తెలివిగలవాఁడైనప్పటికి.

ఉ॥ అక్కఱపాటుతోఁచి యతి•యత్నమొనర్చి విశుద్ధ భక్తితో
నిక్కముగా భజింపదగు •నిశ్చలమానస మక్కటా చెడెఁ

మ్రుక్కిడి వ్రాలెనుంటిని సమూలము నాశనమయ్యె నాత్మయే
ఫక్కిఁ జరింతు దిక్కెవరు పాపవిభంజన! తండ్రి రాఘవా.

36 అర్థము:—అక్కఱపాటు=అవసరము; విశుద్ధభక్తితో=నిర్మలమైన శ్రద్ధతో; మ్రుక్కిడి=మూర్ఖుఁడు; సమూలము=పూర్తిగా; ఆత్మ=జీవుఁడు(పరబ్రహ్మ) ఏఫక్కిన్=ఏమార్గమునందు; పాపవిభంజన=పాపములను బోఁగొట్టువాఁడా(రామా)

ఉ॥ తేలునకుండు, కొండెమునకుం దీవ్రవిషంబు, రగాళికోర నా
భీలవిషంబు నుండు, పర పీడ నొనర్పక పుట్టలందు నే
మూలనొ డాగు, సజ్జనుల మోసము సేసెడి మోసగాండ్రకో,
నాలుకతీపులో విషమనంతము సుమ్ము తలంప రాఘవా.

37 అర్థము:—ఉరగాళికోరన్=పాముల కోరలందు; ఆభీల విషము=భయంకరమైన విషము; పరపీడన్=ఇతరులను బాధ పెట్టుటను; మోసగాండ్రు = పరులను మాయపుచ్చువారు; అనంతము=అధికము(అంతము లేనిది) సజ్జనులన్=మంచివారిని.

ఉ॥ మానకమంచికార్యము లమానుషశక్తి; నియోగపద్ధతిన్
జానుగఁ జేసినాను ఫలసాయవిచారము లాత్మ నెంచుచున్
బూనికయుక్తటాతుదకుం బూర్తిగ భగ్నమునొందెజూడఁగాఁ
దానొకటిన్ దలంప నిల దైవమొనర్చు మఱొండు రా॥

38 అర్థము:—అమానుషశక్తి నియోగ పద్ధతిన్=మానవులకు సాధ్యముగాఁజాలనట్టి గట్టిప్రయత్నముతో; సుఫలిసాయ విచారములు = బాగుగ లాభమువచ్చునట్టి యాలోచనలు; పూనిక=ప్రయత్నము, తుదకు=చివరకు; భగ్నముగాందేన్= చెడిపోయెను; మఱొండు=ఇంకొకవిధము.

ఉ॥ కొంచెపుబుద్ధిమానవులు,♦కొంపలుగూల్చుకుమార్గగాములే
తెంచి, విపత్తులన్ గలియఁ♦దింప,విచార విహారచిత్తులై
యెంచఁగ లేకయాపదల♦నెమ్మెయిగొంది,విషాదవార్ధిలోన్
మించఁ జరించి కుంది గమ♦నింపరు దుష్టుల రీతి రాఘవా.

39 అర్థము:—కొంచెపు బుద్ధిమానవులు = స్వల్పమైన జ్ఞానముగల మనుష్యులు; కొంపలు=ఇండ్లు; కుమార్గగాములు= చెడునడత గలవారు; ఏతెంచి = వచ్చి; విపత్తులన్=కష్టములలో; కలియఁదింపన్=ముంచి వేయగా; విచార విహార చిత్తులై=ఆలోచనలేని వారై; ఎంచఁగలేక = తెలిసికొనలేక; మించన్ = అతిశయించి; విషాదవార్ధిలోన్=దుఃఖ సముద్రములో; గమనింపరు= తెలిసికొనలేరు; కుంది=దుఃఖిపడి.

ఉ॥ అల్పకుటుంబ జీవులయి ♦యార్యజనాశ్రయ లాభ శక్తి సం
కల్పము దీర భాగ్యకుతు ♦కంబునఁ బెద్దల నీసడించి యా

స్వల్పపు బుద్ధిచేత బల♦వంతము లాపద లెన్నోఁగాంచు నా
యల్పులఁ జూడ జాలియును♦హాస్యముదోఁచును గాదె రా॥

40 అర్థము:—అల్పకుటుంబ జీవులయి = సామాన్యకుటుం బములోఁ బుట్టినవారై; ఆర్యజనాశ్రయ లాభశక్తిఁ=పెద్దల నాశ్రయించుట వలన గల్గిన ఫలముచేత; సంకల్పముదీరఁ= కోరిక నెఱవేరఁగా; భాగ్యకుతుకంబునఁ=ఐశ్వర్యముగల్గినసం తోషముచేత; పెద్దలఁ=పూజ్యులను; ఈసడించి=అగౌరవించి; స్వల్పబుద్ధి=నీచబుద్ధి; అల్పులు=సామాన్యులు; హాస్యము= వెక్కిరింత.

చ॥ ఇనుమునఁ గూడు నగ్ని కెపు♦డిమ్ముగ సమ్మెటపోట్లుగాదె భా
జన మొక యింత లేని గుణ♦జాతి, విహీనుల పొత్తుజేరఁగా
నెనరు వహింపఁజాలరు సు♦నీతి, సుశీల, సుబుద్ధి యుక్తులై
వినయము సూపు నట్టిదులు ♦పీడితులౌ నపకీర్తి రాఘవా.

41 అర్థము;— భాజనము = అర్హత = (యోగ్యతయని యర్థము)గుణ=గుణము;జాతి=జాతియు; విహీనులు=లేనివారు; పొత్తుఁజేరఁగాఁ = దగ్గఱకుఁ బోయి స్నేహము జేసినట్లైన; సునీతి, సుశీల, సుబుద్ధి, యుక్తులై=మంచినీతి, మంచినడవడి, మంచి గుణము గల్గియున్నవారై; పీడితులౌ=బాధపడెదరు.

ఉ॥ నీచమనస్కులౌ జనుల ♦ నేస్తముగోరి మెలంగుచున్న సం
కోచము లేలమీకు సమ♦కూడును దైన్యము హీనభావముల్
యోచనఁ జేసి మేల్మిసమ♦యోచిత మార్గ్మ నెఱింగియున్న చోఁ
గాచుకొనంగ వచ్చు ఘన ♦ కార్యము లైనను! తండ్రి రా॥

42 అర్థము:— నీచమనస్కులౌ జనులు = చెడుబుద్ధిగల మనుష్యులు; నేస్తము=స్నేహము; సంకోచము లేల=సందేహ మొందుకు; సమకూడును = కలుగును; దైన్యము=దీనత్వము; హీనభావము=నీచస్థితి; సమయోచిత మార్గము=తగినవిధము; ఘనకార్యములు=పెద్దపనులు; కాచుకొనంగవచ్చు = సహింపవచ్చును.

ఉ॥సంపదగల్గియున్న తఱిఁ♦జంద్రుఁడ వింద్రుఁడవంచుఁబల్కుచుఁ
సొంపుదలిర్పఁ జేరుదురు ♦క్షుద్రజనంబులు మాటిమాటికిఁ
గొంపల నార్చునా నరుల ♦కూరిమి నమ్ముట బుద్ధిహీనమై
పెంపు నశించు భాగ్యములు ♦వీగు విపత్తులుగల్గు రాఘవా.

43 అర్థము:— సంపదలు గల్గుతఱిఁ = ఐశ్వర్యము గలిగినప్పుడు; ఇంద్రుఁడవు=దేవతలకు రాజైన ఇంద్రునితో సమానుఁడవు; సొంపుదలిర్పఁ=సంతోషము గల్గుచుండఁగా; క్షుద్ర జనములు=నీచులు; కూరిమి=స్నేహము; పెంపు=అభివృద్ధి; కొంపలనార్చు=ఇండ్లను బోడుసేయునట్టి; వీగు=తొలఁగిపోవును.

ఉ॥ ఊర దిరుంగు దుష్టుల న ♦ హా! పరికింప కుపేక్ష సేత కీ
తీరున వృద్ధినొంది గురు ♦ తింప నశక్యములైన బాధలన్
బోరనఁ బెట్టుచుండ్రి పెను ♦ మోసము వచ్చె గతించె కాలమున్
గోరునఁబోవు చేతలకు ♦ గొడ్డలిఁ బట్టఁగ నయ్యొ రాఘవా॥

44. అర్థము:—అహా!=అయ్యో (సంతాపకార్థము); పరికింపక=బాగుగా విచారింపక; ఉపేక్ష సేతకు=ఉరకున్నందులకు; గురుతింపన్ = లెక్క పెట్టుటకు (తెలిసికొనుటకు); అశక్యములైన=అసాధ్యములైన; గతించెన్=గడచి పోయెను; ఊరన్=గ్రామములో.

ఉ॥ అండ యొకింత లేక తిన ♦ నన్నముఁ జిక్కని పేదసాదకున్
మెండు భుజింప నిచ్చి గమ♦నింపుచు, దీనజనాళి బంధువై
యుండఁడె కర్ణుఁడెప్పుడు ప్ర♦యోజన మెంచక గుప్తదాతయై
రెండవ కంటి వారెఱుఁగు♦రీతి నొసంగునె దాత రాఘవా.

45. అర్థము:—అండ=తోడ్పాటు; చిక్కని=దొరకనట్టి; పేదసాదకున్=దరిద్రులకు; మెండు=అధికము; గమనింపుచున్=విచారించుచు; దీనజనాళిబంధువై=దిక్కు లేని మనుష్యులకు చుట్టమై; గుప్తదాతయై=రహస్యముగా నిచ్చువాఁడై.

ఉ॥ ఇచ్చకొలంది బిడ్డలకు నేర్పడఁ♦ బాఠము బోధసేయుచున్
స్వేచ్ఛ ధనంబు ఖర్చిడి భు♦జింపగఁ బెట్టిఁ చరించు మానవుల్

తుచ్ఛుల మాట పట్టి గుణ దోష వివేకము లేమి నేడు జీ
వచ్ఛవమట్ల నైరి మతి భంగము నందుటఁ జేసి రాఘవా.

46. అర్థము:—బిడ్డలకు = పిల్లలకు; ఏర్పడఁ = తెలియు నట్లుగా; స్వేచ్ఛఁ=స్వతంత్రముగా; భుజింపగఁ=తినుటకు; తుచ్ఛులమాట=నీచులమాట; గుణ దోష వివేకము లేమిఁ= మంచిచెడ్డలవిచారించుజ్ఞానము లేకపోవుటచేత; జీవచ్ఛవమట్లు= బ్రతికిచచ్చినవారిపోల్కెగా; మతిభంగము=బుద్ధిమారిపోవుట.

ఉ॥ పూజాలోనర్ప నెంత్రు జన పూజ్యులు విజ్ఞులు దారసిల్లు చోఁ
రాజవతంసులుఁ వరుస రాజ్యవిభూతియు జ్ఞానముఁ గనఁ
యోజయు లేక క్రుమ్మరుట హా నిజబుద్ధి విహీనమాత్ర మే
భాజనమిచ్చి రక్షణ మవశ్యము సేయవె తండ్రి! రాఘవా.

47 అర్థము:—విజ్ఞులు = తెలిసినట్టి జ్ఞానులు; తారసిల్లు చోఁ=ఎదురుపడిన యెడల; రాజవతంసులుఁ=రాజశ్రేష్ఠులు గూడ; రాజ్యవిభూతియుఁ = రాష్ట్రములో భాగ్యమును; యోజయు లేక=ఏవిధము లేక; క్రుమ్మరుట=తిరుగుట; భాజనము=యోగ్యత; అవశ్యము=శీఘ్రముగా.

చ॥ నిరుపమ సత్త్వవర్తన మనింద్యచరిత్రము సాధుభావముఁ
గురువులమీద భక్తి బుధకోటులపై ననురక్తి దీనులఁ

దిరముగఁజూచుసక్తిమహా♦నీయులయందనురాగయుక్తియుఀ
సరఁగుననిమ్ము మానవులు ♦సన్నుతిఁనొందఁగ వీరరాఘవా.

48 అర్థము:—నిరుపమ సత్ప్రవర్తనము=సాటిలేని మంచి నడవడి; అనింద్య చరిత్రము=పూజింపఁదగిన జీవితము; సాధుభావముఀ=మంచిమనస్సు; అనురక్తి=ప్రీతి; తిరము=ఎల్లప్పుడు; సక్తి=కోరిక; మహనీయులు=పెద్దలు; బుధకోటులు=పండితసమూహము; అనురాగయుక్తియుఀ = ప్రీతిఁగల్గియుండుట; సరఁగున=వేగముగా.

ఉ॥ అచ్చపు మైత్రిఁ నెంచి విన♦యంబున మిత్రులఁ జేర, వారలో
యచ్చికమచ్చికల్ గొలిపి♦యాదరముంప కుపేక్ష సేయఁగాఁ
బిచ్చితనంబుగా దెవెను ♦వెంటఁ జరించుట, కుక్కతోకతోఁ
గ్రచ్చఱ నేరుదాటఁజను ♦ ప్రాయిడి చందము నెందు రా॥

49 అర్థము:—అచ్చపుమైత్రిఀ=స్వచ్ఛమైన స్నేహమును; ఎంచి=తలపోసి; మిత్రులన్=స్నేహితులను; ఆదరము= (అభిమానము) ప్రీతి; క్రచ్చఱఀ=శీఘ్రముగా; ప్రాయిడి=మూర్ఖుఁడు.

చ॥ కదలక తాతనాటిదగు ♦ గడ్డయటంచును బెద్దకాలముఀ
జెదరకయుండినఀ ఫలముఁ♦జెంద మదేమివిచిత్రమో కదుఀ
బొదలెను, మొన్నవచ్చిపరి♦పూర్ణధనంబులశాస్త్రిచూడుమా
మొదలునవచ్చువీనులను ♦ మొతుచుఁగొమ్ములులేచు రా॥

50 అర్థము:—గడ్డ=పొలము (భూమి) పెద్దకాలముఁ= చిరకాలమునుండియు; పొదలెను=అభివృద్ధినొందెను; పరిపూర్ణ ధనంబులఁ = అధిక భాగ్యముచేత; వీనులను = చెవులను; మొత్తుచుఁ=అడచివేయుచు.

ఉ॥ లేచినదాది సర్వజన • లియ్యముగోరి సమస్త కార్యముల్
యోచనఁజేసి, కాంచిసమ•యోచితయుక్తి ప్రజాళికొక్కటిఁ
నీచపథంబుమాన్పి గణ•నీయము, యోగ్యమునైన మార్గముల్
సూచనలిచ్చు సజ్జనుల•సుద్ది గ్రహింపరు తండ్రి! రాఘవా.

51 అర్థము:—లియ్యము=స్నేహము (మేలు); ప్రజాళికి= జనులకు; నీచపథంబు మాన్పి=చెడు త్రోవను బోఁగొట్టి; గణ నీయము = ఎన్నిక కెక్కఁదగినట్టిది; సూచనలు = సలహాలు; సుద్దిఁ=వాక్యములను; గ్రహింపరు= తెలిసికొనలేరు.

ఉ॥ రోజులు దుష్టమైన యెడ•రుద్రుని చెంత వసించుచుండినఁ
భోజనమైనఁజిక్కుట య•పూర్వముగాదొకొ యెంచిచూడనా
యోజనుసాంబమూర్తి గళ•మొప్పు మహోసరమాఘణేంద్రముఁ
భోజన మింత లేక పలు•పోకల వాయువు మెక్కెఁ రాఘవా.

52 అర్థము:—దుష్టమైన యెడ = మంచివి కానప్పుడు; రుద్రుని చెంతఁ=శివునివద్ద: అపూర్వము=అరుదు; ఎంచి

చూడన్=విచారింపఁగా; సాంబమూర్తి=శివునియొక్క; గళము= మెడ; మహాసరము=పెద్దదండయైన; ఫణీంద్రమున్=పాము లలో గొప్పదైన వాసుకి; పలుపోకల=అనేకత్రోవలకుఁబోయి, వాయువున్=గాలిని; మెక్కు=తినును.

ఉ॥ కష్టము సంభవించు తఱి♦కార్యము గల్గినయప్పుడున్ సదా
నష్టమునంది కుంది యల♦నాటికి లేమి మఱొక్కసాయమున్
జేష్టలుదక్కి చేయునది♦చెందెడు లాభము పొందఁజాలమి
న్నష్టమొ యిష్టమో దలఁతు♦నర్మిలిఁబ్రోవుము తండ్రి! రా॥

53 అర్థము:—కష్టము=ఆపద; సంభవించుతఱిన్=కలుగు చున్న వేళ; సదా=ఎల్లప్పుడు; అలనాటికి=ఆరోజునకు; చేష్టలు దక్కి=ఇంద్రియ వ్యాపారములు మానుటవలన; చెందెడు= అనుభవించునట్టి, నర్మిలిన్=ప్రీతితో.

ఉ॥ బుద్ధినెఱుంగునాఁటికిట♦పూర్వగృహంబొక చిన్నదుండఁగా
నిద్ధచరిత్ర ! భానుఁడతి♦హీనత జంకక సాహసంబుతో
నుద్ధతి నన్ను గెంటె బహు♦యుక్తులచేగుణమూరుఁడై కటా!
యుద్ధతులందుఁ బేదలకు♦నుండఁ దరంబొకొ వీరరాఘవా.

54 అర్థము:—బుద్ధి నెఱుంగు నాటికిన్ = నాకు జ్ఞానము వచ్చునప్పటికి; పూర్వగృహంబు= పెద్దలచే సంపాదింపబడిన

యిల్లు; ఇద్ధచరిత్ర=ప్రసిద్ధిగలవాడా! అవినీతికిన్=చెడునడతకు; ఉద్ధతిన్=గర్వముతో; గెంటెన్=వెళ్లఁగొట్టెను; కటా=అయ్యో! ఉద్ధతులందు=గర్వితులైన భాగ్యవంతులమధ్య; పేదలకు=ధనమును, బలమును లేని వారలకు.

ఉ॥ శక్తి కొలంది విత్తములు ♦చక్కఁగ నేర్చి దరిద్రకోటికిన్
భుక్తి నొసంగి విద్యల ప్ర♦బోధములిచ్చి సుఖంబు గొల్పు టే
ముక్తియటంచు నెంచి పరి♦పూర్ణముదంబునసంచరించు నా
సక్తిఁ గలుంగఁ జేసి వ్యవ♦సాయసమృద్ధిని బెంపు రాఘవా.

55 అర్థము:—చక్కఁగ నేర్చి = జాగ్రత్తగా సంపాదించి; దరిద్రకోటికిన్ = పేదలగుంపునకు; భుక్తిన్ = భోజనమును; ప్రబోధము= జ్ఞానము; ముక్తి=మోక్షము; పరిపూర్ణ ముదంబునన్=మిక్కిలి సంతోషముతో; ఆసక్తిన్=కోర్కెను; వ్యవసాయసమృద్ధిన్ = ప్రయత్నాభివృద్ధి (సేద్యాభివృద్ధి) చేత ధాన్యమును; పెంపు=అభివృద్ధిఁ జేయుము.

ఉ॥ కొంచెపు బుద్ధివారగుటఁ గూర్చిన విత్తముచేత గర్వమున్
బెంచి మనంబులోన వెను♦వెంటఁ జరించు హితైషివర్గమున్
గించ యొనర్చి మించి విసి♦గించి విపత్తుల ముంచు దుష్టులన్
బంచకుఁ జేరనీక గుణ♦వంతులు నిల్చుట మేలు రాఘవా.

56 అర్థము:—కొంచెపు బుద్ధివారు=నీచులు; (అల్పబుద్ధి గల మనుష్యులు) కూర్చిన విత్తముచేత=సంపాదించిన డబ్బు వలన; హితైషి వర్గముఁ=మేలు గోరినట్టి వారిని; కించ యొనర్చి=అనుమానమును జేసి; మించి=అతిశయించి; విపత్తుల ముంచు=కష్టములలోఁబడ వేయునట్టి; పంచకుఁ=దగ్గఱకు; మేలు=సుఖము.

చ॥ జగతి పదార్థజాలములు • సర్వ విరుద్ధగుణంబు గల్గియుఁ
బగయొక యింత లేక పరి•వర్తన మొంది పరేశు నాజ్ఞచేఁ
దగిన విధంబునఁ దమ య•థాక్రమశక్తి విశేషమాత్ర మే
యుగమునఁ దప్పఁజాల విటు •యోగిజనావన! తండ్రి రా॥

57 అర్థము:—జగతిఁ=భూమిమీఁద (సృష్టిలో) పదార్థజాలములు=వస్తువుల గుంపు; పరివర్తన మొంది=మార్పులను గలవైనను; పరేశునాజ్ఞచేఁ=భగవంతుని యానతివల్ల;యథాక్రమ శక్తి విశేషమాత్రము=సృష్టించిన నాఁడెట్టి శక్తులా దేవుఁడిచ్చెనో యవి కొంచమైనను ( దప్పనివై యుండుననుట ) యోగిజనావన=మునులను రక్షించువాఁడ (రామా)

ఉ॥ యోగ్యతఁగల్గి నట్టిడు న•యోగ్యు నెఱుంగక చెంతఁ జేరుచో
యోగ్యత నాశనంబునగు•నుర్వి యశంబులడంగు వానిదౌ

భాగ్యమునష్టమౌను జనపాలుఁడు దండనఁ జేయునున్నయా
రోగ్యము దీరిపోవుట నిరూఢము గాదె తలంప రాఘవా.

58 అర్థము:—యోగ్యత గల్గినట్టిడు=మంచి నడత గల్గిన మనుష్యుఁడు; అయోగ్యుఁ=నీచుని; యోగ్యత=మంచితనము; ఉర్విఁ=భూమిమీఁద; భాగ్యము=సంపద; జనపాలుఁడు=రాజు; నిరూఢము=ప్రసిద్ధము.

ఉ॥ అన్నమొసంగిసాకునదియంబయెయత్నముమీఁరవిత్తముల్
గ్రన్ననఁగూర్చినన్ దగిన గౌరవ, జీవన, శక్తిమంతుఁడై
యున్నను సాధ్యమే ప్రజలనోర్పువహించిసతంబుఁ బెంపఁగా
నెన్న గజేంద్రుబోలు పిత యెవ్విధి, మాతను మించు రా॥

59 అర్థము:—సాకునది=పోషించునది; అంబయె=తల్లియె; గౌరవ, జీవన, శక్తిమంతుఁడై యున్నను=గొప్పతనముచేత బలవంతుఁడైయున్నప్పటికి; ప్రజలన్=బిడ్డలనుగజేంద్రుబోలు; పిత=ఏనుఁగతో సమాన బలము గల్గిన తండ్రి; మాతను= తల్లిని; మించున్=అతిక్రమించును.

చ॥ దినములు మంచికాని తఱి దిట్టతనంబున గట్టియత్నముల్
గొనకొనిచేసి కార్యమునఁ గూర్చుట కోసము పట్టువట్టినన్
వినయముమీఁర పెద్దల నపేక్షమెయిన్ గనిసాయమెంతయో
యనువుగఁ జేసినన్ విఫలమౌ విధి గండ్రతచేత రాఘవా.

60 అర్థము:—దిట్టతనంబునన్=మనో నిబ్బరముతో; అపేక్షమెయిన్=కోర్కెతో; గనన్ = (పెద్దవారిని) చూడఁగా; గానకాని=పూని; విఫలమా = (నష్టమగును) చెడిపోవును; విధి గంటడతచేత=దైవ దుర్విపాకము వలన.

ఉ॥ మదవతిగోటు, భర్తకను♦మానము నాటు విరాగిచోటు సం
పదలకు లోటు ధూర్తునల♦వాటు జగంబులకెల్ల చేటు నీ
రద మెడబాటు జీవులకు♦రాటు నహో! నిరుపేద కాటు పై
పెదవుల తీటటంచు మును♦పెద్దలు వల్కిరి గాదె రాఘవా.

61 అర్థము:— మదవతిగోటు = స్త్రీయొక్క పోకులు; విరాగిచోటు=సన్యాసియైనచోట; (కోర్కెలు లేనివానికి) ధూర్తున్=చెడ్డవానియొక్క; అలవాటు=అభ్యాసము; చేటు= కీడు; నీరదము=మేఘము; ఎడబాటు=దూరమగుట; రాటు= బాధ; మును=మునుపు; (పూర్వము) నిరుపేదకాటు=దరిద్రుల కోపము.

ఉ॥ మించుమెఱుంగు బంగరపు♦మేని బెడంగులుబాళిగొల్ప నే
తెంచు,లతాంగి,గాంచి, గను♦గొంచి యదృష్టము, నేకతంబునన్
బంచకుఁజేరెనొక్కఁడు,చి♦వాలున లెంపలుగొట్టెనా పెయున్
గొంచెపు పిట్టయే యయిన♦కూత ఘనంబన నొప్పె రా॥

62 అర్థము:—మించు మెఱుంగు = మెఱుపు వంటి కాంతి గల్గిన; మేని బెడంగులు=దేహ కాంతులు; బాళి=మోహము; ఏతెంచు=వచ్చుచున్న; లతాంగిన్=స్త్రీని; (యౌవనవతిని) గణుతించి=లెక్కించి; ఏకతంబునన్=ఒంటరిగా; పంచకున్= దగ్గఱకు; చివాలున=తొందరగా; లెంపలు గొట్టె = చెంపలు వాయించెను; ఘనంబనన్=గొప్పదియనఁగా.

చ॥ చదలునఁ బ్రాకి మేఘములు ♦ జాతకకోటికి జీవమియ్యవే
ముద మొదవంగ భూజములు♦పుష్పఫలంబులనిచ్చుభుక్తికై
నదు లొసఁగున్ విశుద్ధ తర ♦ నారము లీధర రక్షణార్థమై
బొదలు పరోపకారు లిల ♦పూజ్యులుగారె తలంప రాఘవా.

63 అర్థము:—చదలునన్ = ఆకాశమందు; చాతకకోటికిన్=చకోరపక్షులకు; జీవము=నీరు (ప్రాణము) భూజములు= చెట్లు; భుక్తికై=భోజనము కొఱకు; విశుద్ధతరనారములు= స్వచ్ఛమైననీరు; పొదలు=ప్రసిద్ధికెక్కు; పరోపకారులు=ఇతరులకు మేలుసేయునట్టి వారు; పూజ్యను=గౌరవింపఁదగినవారు.

ఉ॥ కార్యము గల్గ నున్నదని♦కందువతోఁ జరియించు పోల్కిఁగా
ధైర్యమునన్ మహాఘనుల♦దర్శనమున్ గని,సంభ్రమించి యా
కార్యము జక్కఁ బెట్టు తమ♦కంబు మనంబును నింపఁ దెల్ప నౌ
దార్యము సూపి తోడ్పడిరి ♦తథ్యము యత్నఫలంబు రా॥

64 అర్థము:—కందునతోఁ = జాగ్రత్తతో; ధైర్యము నన్ = ధైర్యముతో; సంభ్రమించి=తొందరపడి; ఔదార్యము= ఉదారము; యత్నఫలంబు = కృషిచేసిన పనికొనసాగుట; తథ్యము=యథార్థము; తమకంబు=ఉత్సాహము.

ఉ॥ మంచిగుణంబుచేత బహు•మాన్యతనొందుజనంబుసంగతిన్
మించిన సౌఖ్యమబ్బు నుతి•మించు ప్రవర్తనఁగల్గు నుర్విలో
నెంచఁగ దుష్టులన్ గలియ•నెప్పుడు దుర్దశ దుర్యశంబగున్
కించ లడంగి పోవ పరి•కించుట యుక్తము దీని రాఘవా.

65 అర్థము:—బహుమాన్యత నొందు=మిక్కిలిగౌరవింపఁ బడు; సంగతిన్=స్నేహామువలన; మించిన=అతిశయమైన; సౌఖ్యమబ్బున్=సుఖము గల్గును; నుతిమించు=పొగడ్తకందజాలనట్టి; ప్రవర్తన=మంచినడత; ఉర్విపై=భూమిలో; దుర్దశ=నీచస్థితి; దుర్యశము=అపకీర్తి; కించలు=దుఃఖములు; (అవమానములు) పరికించుట=ఆలోచించుట; యుక్తము=తగినపని.

ఉ॥ఓరిమి సర్వసౌఖ్యము ల•హోయన నిచ్చుమహౌషధంబు సూ
కూరిమిమీర దానిసమ•కూర్చుమనుష్యుఁడుసంకటంబులన్
జేరినఁ జీరికిన్ గొన క•శేష బలంబు వహించి కర్జముల్
వారక చక్కఁబెట్టుకొను •భంగము నొందక నెందు రా॥

66 అర్థము:—ఓరిమి=ఓర్పు; అహో యనన్=ఆశ్చర్యపడునట్లు; మహౌషధంబుసూ=గొప్ప మందు గదా; సంకటంబులన్=కష్టములను; చీరికిన్ గొనఁడు=లెక్క సేయఁడు; అశేషబలమునన్=అధిక శక్తిచేత; కర్జముల్=పనులు; వారక=అడ్డులేక; భంగము నొందక=నష్టపడక.

ఉ॥ కఱవున బాధ లెల్లడలఁ ♦ గ్రమ్మి విశేషము పంట లేక నీ
తెఱఁగునఁ గష్టముల్ గనుట♦దెల్లమె యైనను బీదసాదలన్
వెఱపులఁ బాలుసేసి యరి♦పీడ నొనర్చు విధంబుఁగాంచఁగాఁ
వఱడటు మూల్గుచుండఁదన ♦ పైఁబడు తాళఫలంబు రా॥

67 అర్థము:—గ్రమ్మి=చుట్టుకొని; తెల్లమె=స్పష్టమె; వెఱపులన్ = భయములకు; అరిపీడన్ = పన్నులబాధను; వఱఁడు=గుంటనక్క; తాళఫలము=తాటికాయ.

ఉ॥ దుర్జన సంఘముల్ దగిన♦దుష్టగుణంబు వహించి మాటికిన్
దుర్జన భర్జనల్ సలిపి ♦ దందడి సజ్జన కోటి నొంచులే
కర్జములంద్రు, కాంచుమటు♦కాసుల కిమ్మతుఁజేయు బట్ట లే
యార్జనఁగోరి కీటకము ♦ లంతట బెజ్జము పెట్టు రాఘవా.

68 అర్థము:—దుర్జన సంఘముల్= చెడు గుణములు గలవారు; దందడి =శీఘ్రముగా; ఒంచులె = బాధపెట్టుటయే;

కర్జములు=పనులు; కిమ్మతు=ఖరీదు; ఆర్జనన్=సంపాదనను, కీటకములు=పురుగులు; (చిమెటలు)

ఉ॥ ఉత్తమ మానవుల్ జగతి ♦ నుద్భవమంది పరోపకారులై
నెత్తికి వచ్చు నాపదల♦నిశ్చలులై భరియింత్రు; కాంచు మా
యత్తమునన్ మహాత్ములన ♦యంబు స్వదేశపు రక్షణార్థమై
దత్తము లైన కష్టములఁ ♦ దప్పక పొందుట లేదె రాఘవా.

69 అర్థము:—ఉత్తమ మానవుల్ =మంచి మనుష్యులు; ఉద్భవమంది=పుట్టి; భరియింత్రు=సహింతురు; ఆయత్తమునన్ = ప్రయత్నముతో; మహాత్ములు = పూజ్యులైనవారు; దత్తములైన=సంభవించినట్టి (కల్గినట్టి)

ఉ॥ దండి మగంటిమిన్ గలుగు♦తమ్ములు ధర్మజు నాజ్ఞ మీరకన్
జెండతమాని కానకు వి♦చిత్రగతిన్ జన, కౌరవుల్ కదున్
గండుతనంబునన్ నగుట♦కాంచియు నెంచరె భీష్మముఖ్యులుం
బండుగయౌనె యిల్లలుకు ♦మాత్రన వీరికటంచు రాఘవా.

70 అర్థము:—దండి మగంటిమిన్ =ఎక్కువ పరాక్రమమును; ధర్మజున్ =ధర్మరాజుయొక్క; చెండతన్ = కఠినత్వమును; కానకు=అడవికి; గండు తనంబునన్=గట్టిబుద్ధితో; (కర్కశత్వముతో) భీష్మముఖ్యులున్ = భీష్ముఁడు, ద్రోణుఁడు మొదలైనవారు; వీరికి=ఈ కౌరవులకు.

చ॥ సుగుణములున్నవారి దరి♦ సొంపుగఁ జేర, సుశోభ గాంచ రే
వగపును జెందు నీచ గుణ ♦ వంతుల చెల్మి విశేషమాత్రచే
జగతి ప్రసిద్ధికెక్కు, నది;♦ సాగరసంగతి దూష్యమై యహా
తగవును దప్పలేదె తెగు ♦దారిని బోవుట చేత రాఘవా.

71 అర్థము:—దరిఁ=ప్రక్కను; సుశోభ = మంచికాంతి; చెల్మి విశేష మాత్రచే = స్నేహమనే యధిక కారణముచేత; సాగర సంగతిఁ=సముద్రుని సాంగత్యముచేత;(సముద్రములోఁ గలియుటచేత) దూష్యమై = (పనికిరానిదై) నిందింపఁబడు నదై; తెగు దారిని బోవుటచేతఁ = ఇష్టమువచ్చినట్లు వెళ్లుట చేత; తగవుఁ=అర్హతను; తప్పలేదా=పోఁగొట్టు కొనలేదా? (పోగొట్టు కొన్నదని భావము.)

ఉ॥ రోజులు బాగులేని తఱి ♦ రోహణ పర్వత మెక్కి రోసినన్
గాజులపెంకె కాక మన ♦ కన్నుల కందునె రత్నవర్గముల్
రాజునకాప్తమిత్రుఁడయి ♦ లాలననొందు కవీశ్వరుండు నీ
యోజ దరిద్రుఁడై మనఁగ♦నొండొక డేల తలంప రాఘవా.

72 అర్థము:— రోజులు బాగులేని తఱిఁ = అదృష్టము సరిగా లేనప్పుడు; రోహణపర్వతము = రత్నాల కొండ; రోసినన్=వెదకినప్పటికిని; అందునె=కనబడునా? (కనబడదు)

ఆ ప్తమిత్రుఁడయి=ఇష్టుఁడైన చెలికాఁడై; ఈయోజన్=ఈవిధముగాఁ; లాలననొందు=మన్నింపఁబడునట్టి.

ఉ॥ ఆడిన మాట తప్పక న♦యంబును సత్యపథానువర్తులై
పోడిమిఁగాంచు సత్పురుష♦ముఖ్యులు; కోసలనాధుపోల్కి నా
వాడిమయూఖ చంద్రులొగి♦వర్ధిలు నంతకుఁ గీర్తిగాంచు రా
జాడ యెఱింగి వర్తిలెదు ♦చక్కని మార్గముఁ జూపు రా॥

73 అర్థము:—సత్య పథానువర్తులై=ఋజుమార్గమునందు సంచరించువారై; కోసలనాధు పోల్కెన్=అయోధ్యారాజులైన,రఘు, లేక యిక్ష్వాకు మహారాజువలె; ఆజాడ=ఆవిధము; వాడిమయూఖుఁడు = సూర్యుఁడు (వేడికిరణముగలవాఁడు) చక్కని మార్గము=తిన్నని త్రోవ.

ధనమునుధాన్యముల్ తగిన♦ధైర్యముగౌరవయోగ్యతాన్వితున్
జనువునఁజెల్మిసేయ కొన♦సాగు సమస్తము వాంచితార్థముల్
మనకునటంచునెంచుమతి♦మంతులు మోసమునొందికుందరే
ధనికుల నమ్ము వారలకు♦తథ్యము హాని ఘటించు రాఘవా.

74 అర్థము:— ధనమును, ధాన్యముల్, ధైర్యము, గౌరవయోగ్యతాన్వితున్ = డబ్బుచేతను, పంటలచేతను, ధైర్యముచేతను, మర్యాదచేతను, యోగ్యతచేతను, గూడుకొన్నవానిని;

చవుఁగ=స్వతంత్రించి; చెల్మిసేయఁగ = స్నేహమొనర్చినచో; వాంఛితార్థముల్=కోరినకోర్కులు; మతిమంతులు=బుద్ధిమంతులు;(ఇటనాక్షేపకార్థము) హాని=కీడు; ఘటించుఁగ=కల్గును.

ఉ॥ అన్నములేక రాజ్యరమ•హాయని వీడి వనంబు దూర నా
పున్నము బుగ్గియయ్యెనన • పోటరులైన కిరాతసేన లా
సన్నములయ్యెఁ బోరికి న•సాధ్యము నోముగ నాలుబిడ్డలఁ
గన్నను గూడ పుండుపయిఁ•గారము వ్రాసిన రీతి రాఘవా.

75 అర్థము:—రాజ్యరమ=రాజ్యలక్ష్మి; వనము=అడవి; బుగ్గి యయ్యెఁ = బూడిద యయ్యెను; (వ్యర్థ మాయెను) పోటరులు=విల్లు విడుచుట యందు నేర్పరులు; కిరాతసేనలు=బోయదండు; ఆసన్నములయ్యెఁ=సిద్ధమాయెను; నోముగ=రక్షించుట; ఆలుబిడ్డలఁ=భార్యాబిడ్డలను.

ఉ॥ వచ్చియు రాని విద్యలక•వశ్యముఁ బొంగుచు గర్వచిత్తులై
నిచ్చలు సంచరించి తమ•నేర్పును జాటు ప్రబుద్ధు లక్కటా
హెచ్చిన వేడ్క పిల్లి నప•హేళనఁ జేసి శివంబు, వేగ పై
పెచ్చున వచ్చు వేఁటరుల•పీడకు లొంగిన భ్రాతి రాఘవా.

76 అర్థము:—పొంగుచుఁ = మురియుచు; చాటు=చెప్పుకొనెడి; ప్రబుద్ధులు=నీచులు; అపహేళనఁజేసి= వెక్కిరించి; శివము=నక్క; వేఁటరులు=వేఁటగాండ్రు.

ఉ॥ ఒక్కమహాబలుండు తన • యుద్ధతి నేర్పడఁజూపి పోరఁగాఁ
బెక్కుర్ గుంపుగూడి పెను•వీర్యముఁజాటుచు మార్కొనన్ వడిన్
మొక్కవడంగఁజేయు కురు•ముఖ్యుఁడు గౌరవనాథు సేనఁ దా
నొక్కఁడుఁ జెండుచున్ విరటు• నొప్పమి బాపె కిరీటి రా॥

77 అర్థము:—మహాబలుఁడు=మిక్కిలి బలశాలి; ఉద్ధతిన్=ఔద్ధత్యమును; ఏర్పడన్=వెల్లడి యగునట్లు; మార్కొనన్=ఎదురింపఁగా; పెక్కురు=అనేకమంది; మొక్కపడంగఁజేయు= కదలక నిల్చునట్లుఁ జేయఁగలఁడు; కురుముఖ్యుఁడు=కౌరవులలో శ్రేష్ఠుఁడైన; కౌరవనాథు సేనన్ = దుర్యోధనుని సైన్యమును; చెండుచున్=చీల్చుచు; ఒప్పమి=కీడు; కిరీటి=అర్జునుఁడు; పెను వీర్యము=గొప్ప పరాక్రమము.

ఉ॥ బోనునఁజిక్కి భంగపడి•మూల్గెడి వ్యాఘ్రపు పల్కులన్నియున్
వీనుల విందుగా వినుచుఁ • బిచ్చితనంబునఁ గంకణార్థమై
దాని చెరన్ వడిన్ విడిచి •దద్దయు నాపద బాపఁడందఁడే
మానక క్రూరజాతి కిల•మంచి యొనర్చుట హాని రాఘవా.

78 భంగపడి=మోసపోయి; వ్యాఘ్రపు పల్కులు = పెద్ద పులి మాటలు; కంకణార్థమయి = చేతి కడియము కొఱకు; బాపఁడు=బ్రాహ్మణుఁడు; వీనులవిందుగాన్ = చెవులకింపుగా.

చ॥ వరధనయుక్తుఁడైనగుణ♦వంతుఁడు వీరుఁడు దాత్తుఁడైన నా
హరియెడభక్తుఁడైన విన♦యంబునఁ బెద్దలఁ గొల్చువాఁడవై
పరగినఁ గష్టముల్ గనిన♦వాఁడ భిమన్యకుమార రత్న మీ
ధరణిని దైవయోగమును ♦ దాట నశక్యము గాదె రా॥

79 అర్థము:—వీరుఁడు = పరాక్రమశాలి; ఉదాత్తుఁడు= గొప్పవాఁడు; (దాత) హరి=విష్ణువు; అభిమాన్య కుమార రత్నము=అభిమన్యుని కొడుకైన పరీక్షిత్తు; దైవయోగము= బ్రహ్మవ్రాత; దాటన్=తప్పించు కొనుట; అశక్యము=అసాధ్యము; వర ధన యుక్తుఁడైన = మంచి ధనముతోఁ గూడిన వాఁడైనప్పటికిని. (ఐశ్వర్యవంతుఁడై నప్పటికిని)

ఉ॥ ఇమ్ముగ దుష్టకార్యముల ♦నేకత మందున నాచరించి తా
రెమ్మెయిఁ జేయనట్లు జరి♦యింతురు నీచులు సంఘమందునన్
సొమ్ములఁ బ్రోయి నట్టిడులు♦శోధనఁ జేతు మనంగఁ జోరులన్
గుమ్మడికాయ దొంగవలెఁ♦గొంకి భుజంబున గాంచు రా॥

80 అర్థము:—ఇమ్ముగన్=ఇష్టము వచ్చిన రీతిని ఏకతమందునన్=చాటుగా;(ఒంటరిగా) శోధనఁ జేతుము=పరీక్షింతుము; కొంకి=భయపడి; చోరులన్=దొంగలను.

ఉ॥ ఒంటరి యంచు దిక్కు మఱి♦యొక్కరు లేరని జాలినొంది వే
యింటను జేర్చి భోజనము♦ లింపుదలిర్ప నొసంగి సాకఁదాఁ

గంటకుఁడై యిటుల్ కడకు♦ఘాతఁ దలంచిన రీతిఁజూడఁగా
నింట్లను మెక్కి వాసములు♦నిమ్మెయి లెక్కిడు పోల్కి రా॥

81 అర్థము:—ఒంటరి=ఒంటిగా నుండువాఁడు; సాకన్=పోషింపఁగా; కంటకుఁడై=దుర్మార్గుఁడై; కడకు = చివరకు; ఘాతన్=కీడును;ఇంపుదలిర్పన్=ఇష్టమగునటుగా; మెక్కి=తిని.

ఉ॥ ఒత్తిడియున్న నింటఁ గడు♦నోపిక కృత్యము లెల్లఁదీర్చి లో
కోత్తరమైనసద్గుణము ♦గొంతకు గొంతగ్రహించి వర్తిలన్
బత్తియు సత్తియున్ దెలిసి♦భవ్యతఁ గాంచిన నిందితుల్ సతుల్
కత్తులమీఁది సాముగద ♦ కాంతల జీవితమెందు రాఘవా.

82 అర్థము:—ఒత్తిడియున్నన్=అత్తమామల చేతఁగాని, భర్తచేతఁగాని, మఱియితర బంధువుల చేతఁగాని బాధయున్నప్పటికిని;కృత్యములు=గృహములోనిపనులు; కొంతకుకొంత=కొంచెము; గ్రహించి = తెలిసికొని; బత్తియున్ =భక్తియును; సత్తియున్=శక్తియును; భవ్యతన్=గౌరవమును; సతులు=స్త్రీలు; నిందితుల్=దూషింపఁ బడుదురు; కాంతల జీవితము=స్త్రీల బ్రతుకు; కత్తులమీఁది సాము = కత్తులపై సాధనము సేయుట వంటిది.

ఉ॥అన్నముయోగ్యమైన యపు♦డాదరువుండదుకూరలున్నచో
నన్నముసుభ్రమౌటరుదు♦యత్నముఁలెన్నొ యొనర్పసత్కృతుల్

సున్నలు యత్నహీనమున • శోభిలుచుండు మహాప్రబంధముల్
విన్నపు డేమిఁ దోపదు వి • వేకము లేనపు డుండు రాఘవా.

83 అర్థము:—యోగ్యమైనపుడు=మంచిదిగానున్నప్పుడు; ఆదరువు=తోడ్పాటు (కూరలు మొదలైన సహాయ తినుబడి వస్తువులు; శుభ్రపాట=పరిశుద్ధమైనది;(అనగా బియ్యముగాక చిమిడిపోవకతినుట కర్హమైనది యనుట) అరుదు=అపూర్వము; (తక్కువ సరిగానుండదని భావము) సత్కృతుల్=మంచికావ్యములు; సున్నలు=పూజ్యము;(కుదరవని భావము) మహాప్రబంధములు=మంచిగ్రంథములు; యత్నహీనములు=ప్రయత్నము లేకపోయి నప్పటికిని; శోభిలును= ప్రకాశించును; వివేకము లేనపుడు=ఆలోచన లేని వేళల.

ఉ॥ మెల్లన దుష్టశీలుని స • మీపముఁ జేర్చి విశాల దృష్టిమై
నుల్లము ద్రిప్పి సద్గుణము • లొందిసుఖించిమనంగయత్నముల్
కల్ల యొకింత లేక తమ • కంబునఁ జేయ వృథాశ్రమం బహో
యుల్లిని బాలముంపఁదన • కొప్పిన వాసనఁ బోదు రాఘవా.

84 అర్థము:—దుష్టశీలుని = చెడు నడతఁ గలవానిని; విశాల దృష్టిమై = దూరాలోచనతో; (ఉదారభావముతో) ఉల్లము ద్రిప్పి=మనస్సు మరల్చి; మనంగ = బ్రతుకుటకు;

కల్ల = అబద్ధము; వృథాశ్రమము = కష్టము వ్యర్థమైనది; ఉల్లిని=హృల్లిపాయను.

ఉ॥ ఇజ్జగమందు సర్వజనులిమ్ముగ సౌఖ్యములొంద మిత్రుఁడే
యొజ్జయునాప్తుఁడుం దుడుకుఁజేయునుద్ధతిమాన్పెడిమంత్రియుం సదా
వెజ్జును గాచువాఁడునయి వెంటఁ జరించుఁదొలంగనాపదల్
సజ్జనమైత్రి యర్థములొసంగెడు సాధనఁగాదె రాఘవా.

85 అర్థము:—మిత్రుఁడే=స్నేహితుఁడే; ఒజ్జయుం=గురువును; ఆప్తుఁడుం=బంధువును; వెజ్జును=వైద్యుఁడును; కాచువాఁడు=రక్షించువాఁడు; ఉద్ధతిం=ఔద్ధత్యమును; (దుడుకుఁదనమును) సజ్జనమైత్రి=మంచివారితోటి చెలిమి; అర్థములు=సంపదలు; (కోర్కెలు) సాధన గాదె=ఉపయోగమైన వస్తువు గదా.

ఉ॥ ఎన్నగరాని ప్రార్థనల నెప్పుడు స్వాంతము నిల్పి నిష్ఠతోఁ
దిన్నని సేవలం సలిపి దివ్య నిగూఢ నిరూఢ భక్తిమై
పెన్నిధిఁగన్న పేదవలెఁ బేర్మి వెలుంగఁ బ్రసన్నమూర్తివై
సన్నిధిఁ జొచ్చు శక్తి నిడుసారసలోచన! తండ్రి రాఘవా.

86 అర్థము:—స్వాంతము=మనస్సు; నిష్ఠతోం=నియమముతో; దివ్య నిగూఢ నిరూఢ భక్తిమై=శ్రేష్ఠమైన, రహస్య

మైన, ప్రసిద్ధమైనట్టి భక్తితో; పెన్నిధి=గొప్పధనము గల భాండము; పేర్మి=కీర్తి; వెలుఁగన్=ప్రకాశించునట్లు; ప్రసన్న మూర్తివై=సంతోషము గలవాఁడవై.

ఉ॥ విద్యలు నేర్చినన్ దగు ప్ర•వీణత లేమి మనంబులో నిన్నున్
హృద్యపదంబు గొల్వ బల•హీనపు చిత్తము వశ్యమౌనె యే
పద్యము లుచ్చరించి యెటు•ప్రార్థన సల్పిన నాలకించి యే
వైద్య మొనర్చియో కడకు•వారని భక్తి నొసంగు రాఘవా.

87 అర్థము:— ప్రవీణత లేమి = నేర్పు లేక పోవుట చేత; హృద్యపథంబున్=వశీకరణ వేద మంత్రముచేత; (ఇంపైనవిధమున) ఉచ్చరించి=పలికి; వైద్యము=చికిత్స; వారని=విడువని; (ఎడ తెగని) వశ్యమౌనె=స్వాధీనమగునా.

చ॥ చదువది యెంత నేర్చినను,•శాంతముగల్గిన, త్యాగశీలుఁడై
పొదలిన గాని, భూతదయ•పూర్తిగ నుండినగాని, నీతి సం
పదగలవాఁడె, కాని, బహు•భాష లెఱింగినఁ గాని, సత్యమున్
గుదురక యున్న సద్గతులు•గూడవటందురు గాదె రా॥

88 అర్థము:—త్యాగశీలుఁడై = దానముఁ జేయువాఁడై; పొదలినగాని=వర్ధిల్లి నప్పటికిని; శాంతము=నెమ్మది; భూత

దయ=అన్నిజీవరాసు లందును దయగల్గియుండుట; సద్గతులు=పుణ్యలోకములు; (మోక్షము) కూడవు=దొరక నేరవు.

ఉ॥ ఎందుకు జీవరాసులను♦యీవు సృజింతువొ పెంపనెంతువో
యెందు కడంపనెంచెదవొ♦యేమిప్రయోజన మాసఁజేసి యీ
చందమునన్ జరించెదవొ ♦ సంయమి వర్యుల కైనఁగాని నీ
కందువ లిట్టి వంచు నెఱుఁగన్ ♦ వశమా పరమాత్మ రా॥

89 అర్థము:—జీవరాసులను =ప్రాణిలోకమును; సృజింతువొ=పుట్టించెదవో; అడంపన్ =నశింపఁజేయుటకు; ఎంచెదవో=తలంతువో; సంయమివర్యులకైన=మునిశ్రేష్ఠులకైన; నీకందువలు=నీచేతలు;(నీమెలకువలు)వశమా=సాధ్యముగాదు

ఉ॥ వ్రేటుల కోర్చి శత్రుజన♦పీడ భరించి భయార్తులౌ ప్రజన్
గోట వెడల్చితెచ్చి యొక♦గుప్తగృహాంతర సీమ డాచినన్
బాటు దలంపకే కఠిన ♦ వాక్కులఁబల్కె విభుండు నయ్యయో
నీటుగ నాగవల్లికడ ♦ నిష్ఠుర మిట్టి దనంగ రాఘవా.

90 అర్థము:—వ్రేటులు = బల్లెపు పోట్లు; శత్రుజనపీడ=విరోధుల యొక్క బాధను; భయార్తులౌ=భయముచే నేడ్చుచున్నట్టి; ప్రజన్=ప్రజలను; (అంతఃపురమందలి, స్త్రీలను, పిల్లలను,వృద్ధులను)గుప్త గృహాంతర సీమన్=రహస్యమైన యింటి

లోపలను; డాచినన్=దాచఁగా; కఠినవాక్కులు = పరుషపు మాటలు; విభుండు=రాజు; నాగ్రవల్లి=పెండ్లిలో నాల్గవనాఁడు; జరుగు శుభకార్యపుతంతు; నిష్ఠురము=కఠినత; (నింద)

చ॥ వ్రతముల వల్లగాని, యుప♦వాసము నుండుట చేత గాని,స ద్గతు లొనఁ గూడఁబోవు కుల♦కాంతకుఁదత్పతి సేవకొంటె స ద్ర్వతముమఱొండు లేదనుచు♦ధర్మవిదుండగు వ్యాసమౌని ని శ్చిత మొనరించు నర్థమె ప్ర♦సిద్ధి వహించును గాదె రా॥

91 అర్థము:—వ్రతములు=నోములు; సద్గతులు = ముక్తి మార్గములు; కూడఁబోవు=దొరకఁ జాలవు; కులకాంతకు= కులస్త్రీకి; తత్పతిసేవ = ఆ భర్తను బూజించుట; సద్ర్వతము= యుక్తమైననోము; (మంచిదైననోము) ధర్మవిదుఁడు=న్యాయ శాస్త్ర మంతయుఁదెలిసినవాఁడు; వ్యాసమౌని=వేదవ్యాసుఁడు.

ఉ॥ గుట్టుచెడంగ సైన్యమరి ♦ కోల్తలపాల్పడి బెగ్గటిల్లగా దిట్టతనంబు వీడి గురు ♦తించి పరాజయమున్ విభుండుఁదా నెట్టనఁబారువేళ గమ♦నించి సహాయముఁజేయఁమిత్రులున్ రొట్టి తునింగి నేతబడె ♦యూఢియనన్ విజయంబు రాఘవా.

92 అర్థము:— గుట్టుచెడంగన్ = రాజ్యమందలి లోపా లోపము లన్నియు శత్రులకు బోధపడుట చేత; అరికోల్తలబా ల్పడి=శత్రుబాణముల యొక్క దెబ్బలకుజిక్కుటచేత; బెగ్గటిల్ల గాన్=భయపడఁగా; దిట్టతనంబు వీడి=ధైర్యమును లేనివాఁడై

పరాజయము=ఓటమి; గురుతించి=తెలిసికొని; గమనించి=కని పెట్టి; విజయము=జయము.

ఉ॥ చెప్పులొ ముల్లు కాలికి వి॥శేషము తీత, గృహంబులో సదా
యప్పుల చేత రోత, విన॥యంబు నెఱుంగని బంటు, కోఁత తా
మెప్పుల కిచ్చువాఁడు మెఱ॥మెచ్చులదాత, నిజాధినాధులన్
ముప్పుల ముంచు భార్యలొగి ॥పూర్వభవాంచిత గీత, రా॥

93 తీత=బాధ; అప్పులచేత=ఋణములు చేయుట; రోత= అసహ్యము; వినయంబు నెఱుంగని బంటు=అడఁకువలేని సేవకుఁడు; కోఁత=మిక్కిలిబాధ; మెప్పులకు=పొగడ్తలకు; నిజాధినాధులన్=భర్తలను; ముప్పులముంచు = కష్టముల పాల్సేయు; పూర్వభవాంచిత గీత= పూర్వజన్మములోఁ జేసినయదృష్టము.

హృదయము కోపకీలమయి॥యెత్తరియుక్తమయుక్తముల్ గనన్
సదయత లేమి, తీవ్రతన॥సాధ్యము,సాధ్యము లూహసేయకే
కదనముసేయ దూకు నయ॥గారము లేని మనుష్యకోటికిన్
వదలక యాపదల్ తగులు॥భారము హెచ్చు,ధరిత్రి, రాఘవా.

94 అర్ధము:— యుక్తము=తగినపని; అయుక్తము=తగని పని; సదయత లేమి=దయ లేక పోవుట చేత(జాలిగల్గించు ఆలోచన లేక పోవుట చేత) కదనము=యుద్ధము; నయగారము=ఆలోచన.

చ॥ కవనము సెప్పుటన్న బహు♦కష్టమె కాని సుఖంబు లేదు; గే
బవలు పరిశ్రమన్ గనుచుఁ♦బండితవర్యులు మెచ్చునట్లు,మా
ర్దవముగ కావ్యరాజములు♦వ్రాయదొరంకొన,సద్రసంబు లొ
ప్పవు, రసమొప్పఁజేయ తల♦ప్రాణము శోకకుఁ జేరు, రా॥

95 అర్థము:— కవనము=కవిత్వము; పండితవర్యులు=పం
డితులలో శ్రేష్ఠులు; మార్దవముగన్=మృదువుగా; కావ్యరాజ
ములు=మంచిప్రబంధములు; వ్రాయదొరంకొనినన్=వ్రాయ
ప్రయత్నించినప్పటికిని; సద్రసంబులు=మంచిరసములు(శృంగా
రము, హాస్యము, కరుణము, మున్నగునవి)

ఉ॥ లోపల శత్రువర్గ మవ♦లోడన చేసి, యడంపఁగల్గుచో
నాపదగూర్చువా రెవరు?♦అందఱుమిత్రు లెయౌదురంద్రహో
శ్రీపతి నీపదాబ్జయుగ♦చింతనఁదక్క తదన్యచింత నా
దాపునఁ జేరనీయక స♦దా కనిపెట్టవె, తండ్రి, రాఘవా॥

96 అర్థము:—లోపలి శత్రువర్గము=లోభము, మోహము,
కామము, క్రోధము, మదము, మాత్సర్యము ననువాటిని,
అవలోడన చేసి=చక్కగా విచారించి, ఆపద=కష్టము; కూర్చు
వారు=కలిగింప లేరు;శ్రీపతి=విష్ణువు; (భగవంతుడు) నీపదాబ్జ
యుగ చింతనన్ =నీపాదములను ధ్యానించుట చేత; తదన్య
చింత=వేఱొకవిచారము; దాపునన్=సమీపమునకు.

ఉ॥ శాత్రవ పంక్తికంఠు ననుజన్మునకున్, శరణం బొసంగి లో
కత్రయ కంటకుండు దశకంఠుని ద్రుంచి, మునీంద్రకోటి, తా
పత్రయ మెల్ల బాపిన; కృపాకర! నీకిది న్యాయమే; యహో
రాత్రులు నిన్భజింప విన రాదొకొ నామొఱ తండ్రి రా॥

97 అర్థము;— శాత్రవ పంక్తికంఠున్ = విరోధియైన రావణుని, అనుజన్మునకున్ = తోడబుట్టినవిభీషణునకు, లోకత్రయకంటకుండు=మూడులోకములకును బాధగలించువాఁడు; దశకంఠుఁడు=రావణుఁడు; తాపత్రయము = మూడుబాధలు, (పుత్రేషణ, దారేషణ, ధనేషణ యనునవి.)

ఉ॥ కోరను, రాజభోగములఁగోరను నే ధనధాన్యసంపదల్
కోరను మౌక్తికంబులనుగోరను సద్గజవాజి యూథముల్
కోరను గోగణంబులనుగోరను సుందరహర్మ్యముల్, సదా
కోరెద మోక్షమార్గమును గొండొకప్రీతి నొసంగు రా॥

98 అర్థము:— మౌక్తికములను=ముత్యాల హారములను, సద్గజవాజియూథముల్=మంచి యేనుగులు, గుఱ్ఱముల సమూహమును; గోగణంబులన్=ఆలమందలను, సుందర హర్మ్యములు = అందమైన మేడలు; కొండొకప్రీతిన్ = కొంచెము ప్రేమతో (తగినయాదరముతో)

ఉ॥ ఇమ్ము సమస్త సంపదల, నీరికలెత్తెడు కోర్కులెల్ల నా
కిమ్ము; మహానుభావులు న హీన గుణాకరు లేఁగుత్రోవకున్
గమ్మనఁ బోవుశక్తి, వర కావ్యములెన్నొ లిఖించి మాటికిన్
సమ్మద మొందనిమ్ము రఘు నాయక; పాయక నెప్డు రా॥

99 అర్థము:— ఈరికలెత్తెడు కోర్కులు=పుట్టుచున్నట్టి కోర్కులు, మహానుభావులున్=గొప్పవారును, అహీన గుణాకరులు=మంచి గుణవంతులు, ఏఁగుత్రోవకున్=వెళ్లునట్టి స్థితికి, గమ్మనన్=ఆశ్చర్యమగునట్లు, వరకావ్యములు = శ్రేష్ఠమైన కృతులు, లిఖించి=వ్రాసి, సమ్మదము=ఎక్కువసంతోషము.

ఉ॥ అంచితభక్తి నేమఱక యాకలి దప్పుల నుజ్జగించి వే
తెంచగరాని దీక్షపర మేశ్వరు, నీశ్వరు నిల్పి శాంతిమై
మించిన వేడ్క ధ్యానమున మేకొను సుస్థిర బుద్ధినిచ్చి నా
కించ లడంచి ప్రోవు మరు గేల, రఘూత్తమ తండ్రి రా॥

100 అర్థము:—ఏమఱక=అశ్రద్ధఁ జూపక, ఉజ్జగించి=విసర్జించి, దీక్షన్=శ్రద్ధతో, శాంతిమై=శమాగుణము లేక నెమ్మది గల్గి, మేకొను=తగులొకొనునట్టి, సుస్థిరబుద్ధిన్=చలనములేని మనస్సుతో, కించలు=దుఃఖములు, అడంచి=పోఁగొట్టి, మరు గేల=చాటెందుకు?

ఉ॥ కూర్చితి నుత్పలంబులను • గొన్నిటి చంపకమంజరుల్ కదుఀ
బేర్చిన సంతసంబున వి•నీతమతిన్ గుసుమోపహారముఀన్
నేర్చిన యట్లు గైకొనవె • నిర్మలభక్తి నొసంగవే సదా
చేర్చవె భక్తులందు పరి•శీలనఁ జేయవె తండ్రి? రాఘవా.

101 అర్థము:— ఉత్పలంబులన్ = ఉత్పల మాలలును, చంపకమంజరుల్ = చంపకమాలలు, (అను పద్యముల చేత) కదుఀ + పేర్చిన = మిక్కిలి ఎక్కువైన, వినీతమతిన్ = వినయముతోఁ గూడినహృదయముతో, కుసుమోపహారముఀ = పుష్పముల కానుకను, పరిశీలనఁ జేయవె = బాగుగా విచారింపవె.

స మా ప ము.



